3600, A.D. 505 నాటికి వచ్చిన కృతయుగాంతమున రచింపబడి నట్లు తేలుచున్నది. కలి 1200 సం॥లో నొక యుగము వచ్చినట్లు మహా భాగవతమున స్పష్టముగనే యున్నదిగదా. ఇది భారతయుద్ధకాలపు యుగము. ఆ యుద్ధమైన 37 సం॥లకు వచ్చెను. అప్పు డారంభమైన యుగము కృత యుగమే కాని యన్యముగాదు. కాని కలి యని లెక్కించిరి. తర్వాత కృత యుగము 1200 సం॥లు జరుగుచుండగా నవగా నప్పుడే వృద్ధిజేయబడిన దేవ మాన మహా కలియుగము 3600 సం॥లు జరుగుచుండగా నీ సూర్యసిద్ధాంత రచనము జరిగినట్లు కనబడుచున్నది. ఈ సిద్ధాంత మట్లు వ్రాయబడి క్రమ ముగా మార్పులు చేర్పులనుగూడ బొందినట్లు మనకు స్పష్టపడుచున్నది. కలకత్తా యూనివర్సిటీ ప్రచురణ పీఠికను సమగ్రముగా జూచినచో నీ విషయము బోధపడును గాని యందలి కాలనిర్ణయము మాత్రము వ్యత్యాస ముగ నున్నది.

ఈ యుగములన్నియు 360 సూర్యోదయ దినములుగల సావన సంవత్సరములచే నిర్మింపబడుటవల్ల నివి సౌరమానము ప్రకారము చూచి నప్పు డొక్కొక్క యుగమునకు 1183 సం॥లు 3 మా 20 రోజులుంగా అగుచున్నవి. ఈ ప్రకారము గణితమువేసినయెడల పూర్వకాలమున సౌర మాన ప్రకారముగ నీ క్రింది కాలములందు పూర్వయుగము లేర్పడినట్లు తేలును.

క్రీ. పూ. 6651 వ సం॥ నవంబరు ప్రాంతమున ప్రమోదూత సం॥లోను,
,, 5468 ,, సెప్టెంబరు ప్రాంతమున ప్రమాదీచ సం॥నను,
,, 4285 ,, మే నెల చివర దుర్ముఖి సంవత్సరమందును,
,, 3102 ,, ఫిబ్రవరిలో ప్రమాది సం॥నను,
,, 1920 ,, నవంబరు ప్రాంతమందు దుందుభి సం॥మందును,
,, 737 ,, ఆగస్టు మొదటిలో విశ్వావసు సం॥మందును,
క్రీస్తుశకం 447 ,, ఏప్రియల్ చివరలో సర్వధారి సం॥మందును,
,, 1630 ,, జనవరి చివర లేక ఫిబ్రవరిలో ప్రజోత్పత్తి సం॥ర

మందును యుగములు వచ్చెను. ఈ చివరిది మహాకల్యాంతర్గత కలియుగం. ఇది క్రీ.శ. 2812 లో అంతమగును. మన పంచాంగములందు చెప్పబడెడి



ఆద్యంతములు ఒకదానికొకటి తారుమారైనట్లు కన్పడుచున్నవి. వానిని యీ క్రిందిరీతిగా అమర్చి చూచినచో సరిపోగలవు. గణితకారులు దీనిని పరిశీలించి గుణించి చూడగలరు.

కల్పాది సర్వజిత్తు చైత్ర శు ౧. ఇది కల్పముగా చెప్పబడినది గాని ఒక యుగమే జరిగినది.

మొదటి యుగం కార్తీక శు ౯ ఆరంభం
2 వది ,, భాద్రపద బ ౨౧ ,,
3 వది ,, వైశాఖ బ ౧౦ ,,
4 వది ,, మాఘ బ 3౦ ,,
5 వది ,, కార్తీక శు ౧౫ లేక బ ౧౨ ఆరంభం
6 వది ,, శ్రావణ శు 3 ఆరంభం
7 వది ,, వైశాఖ శు 3 ,,
8 వది ,, మాఘ శు ౨ ,,

ఇందలి 2, 6 ఆరంభములు ఒకదానికొకటి మారనుగూడ వచ్చును. వృశ్చిక, సింహ, వృషభ, కుంభసంక్రమణ ప్రవేశములలో యుగారంభము లైనట్లు గల ఆధారములు చివరనున్న 4 యుగాల కన్వయించును. ఇవి యన్నియు 3102 సం॥ ఫిబ్రవరి18వ తేదీ నాటి యుగారంభమున మేష రాశియందు సప్తగ్రహము లున్నట్లు కనుగొనిన శాస్త్రజ్ఞుల లెక్కలనుబట్టి తక్కినవి నిశ్చయింపబడినవి. ఇవియే మన పురాణములందలి వంశావళి తరములకు పంచాంగములలోని యుగాబ్దతిథులకు సరిపడును. గాని యితర విధములగు గుణకములకు సరిపడవు. పైన నుడివిన కల్పాదికి 20 యుగ ములకు పూర్వము ప్రభవ సం॥లో నొక యుగారంభము గన్పడుచున్నది. ప్రతి మన్వంతరమునకు ఒక విష్ణ్వవతార ముండుననియే పురాణములం దున్నది. ఈ రీతిగ విష్ణుపదవిలోనున్న యనేకుల పుట్టుపూర్వోత్తరాలు ముందుపుటలలో నుడివెదము. ప్రతి యుగమునందు ఒక్క విష్ణ్వవతారము మాత్రమే వచ్చునను విషయము భగవద్గీతలో తర్వాత కల్పింపబడినది. ఒక్క యుగమందే మొదటి ఆరుగురు మనువులు పాలించినను దానిని